సహకార గ్రంథమాల.
ప్రథమ పుష్పము.

సంపాదకుడు.
నరసింహదేవర సత్యనారాయణ

# సహకార బాలశిక్ష

మొదటి కూర్పు 1000 ప్రతులు

1924



వెల ౩ అణాలు.

# చ్యవనప్రాశ్యము.

ఇది పిల్లలు పావుతులము మొదలు అరతులము వరకు పెద్దలు అరతులము మొదలు తులమువరకు ఉదయసాయంకాలములయందుపుచ్చుకుని4-5తులములు ఆవుపాలలో కొంచెము పంచదార చేర్చి పుచ్చుకొనిన కాసశ్వాసలను క్షయరోగమును బోగొట్టును. మరియు క్షీణించినవారలు వృద్ధులు, బాలురు, వీరలశరీరమునకు బలమును కలిగించును. స్వరక్షయము, హృదయరోగము, వాతరక్తము, దాహము, మూత్రము, శుక్లమునందలి దోషములను బోగొట్టును. ఆయుర్వృద్ధి, జ్ఞాపకశక్తి, ఇంద్రియపటుత్వము, జఠరదీప్తి, బలమును వీటిని కలుగజేయును.

వెల తు 40 లు గల డబ్బా రూ 4 లు.

ఆయుర్వేదనిలయము. వైద్యరాజ ద్విభాష్యం
చింతలూరు. గోదావరిజిల్లా వెంకటేశ్వర్లు
ఆలమూరుపోస్టు, ద్విభాష్యం బుచ్చయ్య

దేశీయ విద్యాలయ ముద్రణాలయము, రాజమహేంద్రవరము

# భూమిక.

సహకార సూత్రములను సులభమార్గమున ప్రాథమిక పాఠశాలలలోని బాలుర బోధన నిమిత్తము యీ చిన్నపుస్తకము వ్రాయబడినది. గత మేయి నెలలో ఆలమూరు గ్రామమున జరిగిన నాల్గవ గోదావరి మండల సహకారసభలో సహకార విద్య ప్రాథమిక పాఠశాలలలో బోధించవలసినదిగా కోరి తీర్మానించినారు. ఈ తీర్మానమును ఆచరణలో పెట్టుటకు ఆలమూరు లోకల్ కో ఆపరేటివ్ యూనియన్ వారు విద్యార్థుల ఉపయోగమునిమిత్తము యీపుస్తకమును ప్రకటించుటకు పూనినారు. సహకారోద్యమమును గూర్చి విపులముగ దెల్పుటకు యింకను కొన్ని గ్రంథములను ప్రకటించుట కుద్యుక్తులైయున్నారు.

సహకారోద్యమము ప్రపంచమంతటను వ్యాపించినది. ప్రతినాగరిక దేశములోను సహకారసంఘములు నెలకొల్పబడినవి. రాజకీయ వేత్తలు సంఘసంస్కర్తలు పారిశ్రామిక నిపుణులును యుద్యమ ప్రాశస్త్యమును బాగుగ గుర్తించుచున్నారు. వివిధ రాజకీయ పక్షలవారు భిన్నమతస్థులు భేదభావములను వీడి పర

స్వరసానుభూతితో యీయుద్యమమున నేకీభూతు లగుచున్నారు.

సహకారోద్యమము వ్యక్తిస్వాతంత్ర్యమున కుచితగౌరవము నిచ్చి సాంఘికసమిష్టి భావము నుద్బోధించుచున్నది. నిరంకుశత్వమునకు తావివ్వక అధికసంఖ్యాకుల అభిప్రాయప్రకారము విషయ నిర్ధారణకు తోడ్పడుచున్నది. బీదజనులకు ధనవంతులకు సామరస్యభావము చేకూర్చుచున్నది. దేశముయొక్క ఆర్థిక, నైతిక, రాజకీయ విద్యాపురోభివృద్ధికి సహకారోద్యమము నిలయమగుచున్నది. బాల్యమునుండియు బడులలో మనబాలురకు సహకారోద్యమమును గూర్చి బోధించిన "నేటిబాలురు రేపటిపౌరులే" గనుక దేశీయపురోభివృద్ధికి వీరలు తోడ్పడగలరు.

కావున మండలములో విద్యాశాఖాధికారులు తాలూకాజిల్లాబోర్డులఅధికారవర్గమువారు ప్రాథమికపాఠశాలలో యీపుస్తకమును ప్రవేశపెట్టి మాప్రయత్నములకు తోడ్పడవేడుచున్నాను.

సంపాదకుడు.

# సహకార బాలశిక్ష.

## ఒకటవ పాఠము.

పిల్లవాడు:—నాన్నగారూ! ఈదినము మన యింటికిభోజనమునకువచ్చిన ఇన్‌స్పెక్టరుగారెవరు?

తం:——ఆయనసహకారసంఘములఇనస్పెక్టరుగారు.

పిల్లవాడు:—నాన్నగారు! ఇది చాలక్రొత్తగావున్నది. ఇదివరలో దొంగలనుపట్టుకొనుటకు, తప్పుచేసినవారిని దండించుటకు పోలీసుఇన్‌స్పెక్టర్లున్నారు. కరణములమీద మునసబులమీద అధికారముచేయుటకు రివిన్యూఇన్‌స్పెక్టరులు గలరు. కల్లుపైన ఉప్పుపైననల్లమందుపైనఅధికారముచలాయించుటకు సాల్టిన్‌స్పెక్టరులుగలరు. తపాలఆఫీసులునుతనిఖీచేయుటకు పోస్టలు ఇన్‌స్పెక్టరులు గలరు. ఈమధ్య తాడిచెట్ల జబ్బుకుదుర్చుటకు ఇన్‌స్పెక్టరులు బయలు దేరిరి. ముందుగా నాసంగతియే నేను మరచినాను. మాబడులు పరీక్షించుటకు ఇన్‌స్పెక్టరులు గలరు.

కాని యీపేరు ఎప్పుడును వినలేద. ఈఇన్ స్పెక్టరుగారు చేయుపని యేదో నాకుచెప్పెదరా?

తండ్రి:—నాయనా! ఆయన చేయు ఉద్యోగము చాల గొప్పవిషయములతో కూడి యున్నది. మావంటివారలకే తెలుసుకొనుట చాలకష్టము. నీవు పిల్లవాడవు—పోయి చదువుకొనుము—నీకా సంగతి క్రమముగా తెలియగలదు.

కుమా:— నాన్నగారు! మాబడిలో సివిక్సు చెప్పుచున్నారు. అందులో సర్కారుశాఖలయొక్క విషయము లన్నియు బోధచేయుచున్నారు. అవి అన్నియు మాకు తెలియుచున్నవి. బోధచేసినయెడల ప్రతిసంగతి పిల్లలు తెలుసుకొనగలరు. కావున నాకు ఆవిషయము బోధ చేయవలెను.

తండ్రి:—సర్కారుశాఖలన్నియు బోధ చేయుట సులభము. ఎందువలన అనగా అవన్నియు మనము ప్రతిదినము చూచుచున్నాము. పరపతిసంఘములు ప్రతిగ్రామమున వ్యాపించలేదు. అందువలన బోధచేయుట కష్టము.

కుమార్డు:—ఇన్‌స్పెక్టరుగారు ఎందుకు మన గ్రామము వచ్చినారు.

తండ్రి:—మనగ్రామములో నొక సంఘము నేర్పాటుచేయుటకు వచ్చినారు

కుమార్డు:—ఆసంఘము నేర్పాటు చేయుట కేమి చేసెదరు?

తండ్రి:—మనగ్రామములో నిరయితుల నందర అను చేర్చి యొకసభ చేసి సంఘముండుటవలన కలుగులాభములను బోధ చేసెదరు. వారొప్పుకొనినమనగ్రామములో సంఘమురిజిష్టరుచేయించెదరు.

కుమార్డు:—ఆసభకు నేను రావచ్చునా! బడిలో చదువుకొనుబాలురు సభలకు పోకూడదని గవర్నమెంటువారీమధ్య శాసించి యున్నారని మాయుపాధ్యాయులు చెప్పియున్నారు. అటుల పోయిన కొంతమంది బాలురను శిక్షించి యున్నారు.

తం:—నీవు రావచ్చును. రాచకీయవ్యవహారములు చర్చించుసభలకు పోకూడదని శాసించినారు ఇట్టిసభలకు పోవచ్చును.

కు:—ఎందువలన ?

తం:—గవర్నమెంటువారే యిదియొక శాఖ యేర్పాటుచేసి రయితులకును, బీదజనులకును, సహాయపడుచున్నారు.

కు:—ఇది గవర్నమెంటువా రేర్పాటు చేసిన శాఖయేనా? అయితే మాకు సిబిక్సులో బోధ చేయుటలేదేమి ?

తం:—ఇది క్రొత్తవిషయ మని నేను చెప్పలేదా? క్రమముగా బడులలో కూడ బోధ చేసెదరు

కు:—నా కిప్పుడీసంఘములవిషయమై తెలుసుకొనవలెనని యున్నది. మీరు బోధచేయగలరా?

తం:—నాకుకూడ కొన్నిసందేహము లున్నవి. ఈదినము జరుగు సభకు నీవుకూడ రావచ్చును. అప్పుడు చెప్పినసంగతులు విని నీకు తెలియనియెడల నేను బోధ చేసెదను. నాసందేహములుకూడ ఇన్స్పెక్టరుగారివలన తెలుసుకొనెదను.

కు:—నేను బడికిపోవలదా?

తం:—అటులైన నేను రేపు బోధచేసెదను.

ఈరాత్రి సభజరుగుటకు నేర్పాటు చేయబడును. అప్పుడు నీవుకూడ వినవచ్చును. నీకు తెలియని విషయములు నేను చెప్పెదను.

కు:—నాకు బడివేళ యగుచున్నది. ఆలస్యముగా వెళ్ళినచో మాపంతులుగారు కోపపడెదరు. కావున నేను బడికి పోవుచున్నాను.

తం:—సరే! వెళ్ళుము.

రెండవ పాఠము.

కు:—నాన్నగారు! రాత్రి పాఠములు చదువు కుని నేను వచ్చుసరికి 9 గంట లయినది. అప్పటికిం కను సభ పూర్తి కాలేదు. గాని ఇన్‌స్పెక్టరుగారు ఓపికతో, వచ్చినవా రందరు నడుగుప్రశ్నల కన్నిటి కిని జవాబు నిచ్చుచున్నారు. నాకు నిద్రవచ్చుటచే నేనువెళ్ళిపోతిని. నాకు పరపతిసంఘముల విషయమై తెలుపరా?

తం:—ఇదిగో ఇన్‌స్పెక్టరుగారిచ్చటనే యున్నా

రు. వారు బోధచేసిన బాగుగా తెలియగలదు. వారిబోధ పూర్తి కానియెడల నేను తరువాతచెప్పె దను. వారినడుగుము.

ఇ:—అబ్బాయి ! నీకు సహకారోద్యమమును గురించి తెలుసుకొనవలెనని యున్నదా?

కుర్రి:—కాదు. పరపతిసంఘమునుగురించి నాకు బోధచేయండి.

ఇ:—అటులనే బోధచేసెదను. నీవేతరగతి లో చదువుచుంటివో నాకు తెలుపుము.

కుర్రి:—నేనిప్పటి యయిదవ క్లాసు చదువు చున్నాను.

ఇ:—మీబడులలో సివిక్సు చెప్పుచున్నారా

కుర్ర:—చెప్పరేమి.

ఇ:—సర్కారుశాఖ లన్నియు మీకు బోధచే యుచున్నారు కదా?

కు:—అవును బోధచేయుచున్నారు.

ఇ: —సహకారోద్యమముకూడ సర్కారుశాఖ లలో నొకటి. దానిలో చేరినదే యీపరతిసంఘము

లయేర్పాటు— నీవు తెలుగుస్కూలులో చదువు చున్నావా లేక ఇంగ్లీషు స్కూలులో చదువు చున్నావా?

కు:— నేను తెలుగుబడిలోనే చదువుచున్నాను. కాని యింగ్లీషుకూడ ప్రయివేటుగా చదువుకుం టున్నాను.

ఇ:—నీకు పరపతిసంఘములను గురించి పూర్తిగ తెలుసుకొనవలెనని యున్నదా?

కు:—ఉన్నది.

ఇ:—ముందుగా సంఘ మనగా నేమో తెలి యునా?

కు:— తెలియును.

ఇ:—మీకు చెడుగుడు, ఉప్పనబట్టె, దాగుడు మూతలు, కుండబంతి మొదలగు నాటలాడుచుందు మురా!

కు:—అవును ఆడుచుందుము

ఇ:—అట్టి యాట లాడుట కొక్కపిల్లవా డుం డిన చాలునా?

కు:—మీకు తెలియదా? ఒక్క పిల్లవాడైనను ఆటల నాడుకొనునండి. అధమము నలుగు రైదుగు రైనను నుండవలెను. పదిపది హేనుగు రుండిన నాటలాడుట సరదగా నుండును.

ఇ:—ఆటలాడుటకు కొంతమంది చేరవలెను గదా! అటుల కొంతమంది చేరిన దానిని బాలుర సంఘ మని చెప్పవచ్చును. సంఘ మనగా నేదైనను ఒక పనిచేయుటకు కొంతమందికలసియుండుట అని యర్థము.

కు:—అయితే యీసంఘమున కెంతమంది యుండవలయును.

ఇ:—ఇందువిషయమై సర్కారువారు 1904 సంవత్సరములో చట్టము చేసిరి. తరువాత 1912 సంవత్సరములో దానిని సవరించిరి. ఆచట్టము ననుసరించి పరపతిసంఘమేర్పడుటకు పదిమందికి తక్కువకాకుండ నుండవలెను. అంతకు పైననెంతమందియు యినను చేరవచ్చును.

కు:—ఇంతియేనా పరపతిసంఘములనగా! రాత్రి

యంతయు నిద్రలేకుండనుంచుటయుని చెప్పుటకేగా నాకు బడికి వేళయయినది. నేను పోయెదను.

ఇ:—ఇంతియు కాదు. నీవు తెలుసుకొనవలసి నది చాలగ నున్నది. నేను సాయంకాలమువరకు నుందును. నీవు బడినుండి వచ్చిన వెనుక నింక కొంచెము చెప్పెదను. ఇప్పుడు బడికి వెళ్లుము.

## మూడవ పాఠము.

ఇ:—ఏమబ్బాయి! పరపతిసంఘములగురించి తెలిసికొనుట పూర్తియయిన దనుకున్నావా యేమి? నీ కుత్సాహము తగ్గినట్లున్నది.

కు:—లేదండి మీకు తీరిక యెప్పుడవునో యని చూచుచున్నాను. సంఘమనగా కొంత తెలిసినది.

ఇ:—ఇంకను వివరముగా చెప్పెదను వినుము. మీగ్రామములో పుస్తకభాండాగార మున్నది కాదా?

కు:—అవును. దానిని మేము "లైబ్రిరీ"అందుము. ఎంతో నవ్వుపుట్టించుపుస్తకము లున్నవి.

ఇ:—"లైబ్రిరీ"అని ఇంగ్లీషు భాషలో వాడె దరు. పుస్తకభాండాగారమున పుస్తకము లిచ్చుట కొరకు రుందురు.

కు:—అవును నెలకు రెండణాలిచ్చువానికి పుస్తకము లింటికి చదువుకొనుట కిచ్చెదరు. లేనియెడల ఆలైబ్రిరీయున్న యింటియొద్దనే కూర్చుని చదువు కొనవలెను.

ఇ:—నెలకు రెండణాలిచ్చు వానిని మెంబర్లం దరు. అనగా సట్టిమెంబర్లందరు నిచ్చుచందాలు సరిగా ఖర్చుపరచుచుండుటకు తమలోనే సాధారణుల నయిదుగుర నేర్పాటుచేసుకొనెదరు. ఒక్కొక్కప్పుడయిదుగురుకంటె నెక్కువ కూడ నుందురు. వారలు లోటులేకుండ వ్యవహరించుచున్నది లేనిది అప్పుడప్పుడు సభచేసి మెంబర్లందరు చూచెదరు.

కు:—ఇప్పుడు కొంచెము తెలిసినది.

ఇ:—అటులనే యీపరపతిసంఘములు పరిపాలించుట కయిదుగురు పంచాయితీదార్ల నేర్పాటు చేసెదరు.

కృ:—ఎవరేర్పాటు చేసెదరు? మేజస్ట్రీటుగారా? తహశీలుదారుగారా? కలెక్టరుగారా ?

ఇ:—వారెవరు నిందులో కలుగచేసుకొనకూడదు. ఇదివరలో సంఘమునకు పదిమందికి తక్కువ కాకుండనుండవలెనని చెప్పితిని. వారలనే మెంబర్లందురు. మీ బంధువులలో నాటలాడుకొనునపుడు పెద్దలనేర్పరుచుకొనెదరు కాదా?

కు:—అవును. మాలో నెక్కువమంది యొప్పుకొనినవారు పెద్దయగుదురు.

ఇ:—అటులనే సంఘములో చేరిన మెంబర్లందరు సభచేసి తమలో నయిదుగురను పెద్దలనుగా నేర్పరచుకొనెదరు. వారలను పంచాయితీదార్లందురు. ఇంతవరకు జ్ఞాపకముంచుకొనుము. వారలు చేయు పనులు తరువాత తెలుసుకొనవచ్చును.

కు:—మెంబరు తెలుగుపదమేనా అండీ ?

ఇ:—అది ఆంగ్లపదము. తెలుగులో సభ్యులందురు.

కు:—ఇంగ్లీషు చదువుకుంటే తెలుగుపదములు

మరచిపోవుచున్నామండి. అయితే నేనుకూడ సంఘములో సభ్యుడుగా చేరవచ్చునా!

ఇ:—నీవు చేరరాదు. 18 సం॥రములు వయస్సు మించినవారున్ను మీగ్రామములోనే కాపురము చేయునట్టివారున్ను సంఘములో సభ్యులుగా చేరుట కర్హులు.

కు:—నేను ఎందువలన చేరరాదు.

ఇ:—సొమ్ముతో వ్యాపారము జరుపవలెను. పిల్లలు తక్కువజ్ఞానము కలిగియుందురనియు 18సం॥ మించుసరికి ప్రపంచవ్యాపారములు తెలియునట్టి జ్ఞానము లభించుననియు అట్టివారు వ్యవహరించిన వ్యాపారము శాస్త్రప్రకారము క్రమమైనదిగా నెంచబడుననియు పరిపాలకులు నిర్ణయించిరి. అందుచే పిల్లల నీసంఘములో చేర్చుకొనరు.

కు:—చినప్పటినుండి వ్యాపారము చేయుచుండినగదా పెద్దవాళ్ళయినతరువాత బాగుగా జ్ఞానము కలుగును. కోమట్లుచిన్నపిల్లలచేత నేఅగ్గిపెట్టెలు పెసరట్లు అమ్మించెదరు. రయితులు పిల్లలను చిన్న

ప్పటినుండియు పొలము త్రిప్పుచుండెను. మాఅన్న య్య, బి. ఏ. ప్యాసు అయినాడుగాని దస్తావేజులు వ్రాయవలసివస్తే మానాన్నగారే చెప్పవలెను. ఎప్పుడైనను పొలము వెళ్ళుమంటే మఱునటిదినము తలకాయినొప్పి వచ్చినది అని పరుండును. చిన్నప్ప డినుండి అలవాటుండిన, ఆయన కాకష్టము లేకపో యేది కాబట్టి పిల్లలకుచిన్నప్పటినుండిసంఘములతో సంబంధముంటే పెద్దవాళ్ళయినతరువాత సులభము గా పనులు జరుపగలుగుదురు.

ఇ:—నీవు చెప్పినది నిజమే. పిల్లలకు సంఘము రిజిష్టరుచేయరు. కాని బడులలో పిల్లలందరు చేరి యొకసంఘము నేర్పాటుచేసికొని ఉపాధ్యాయుల సలహాలతో వ్యాపారము చేసుకొనవచ్చును.

కు:—మా మామయ్య సభ్యుడుగా చేరవచ్చునా

ఇ:—ఆయన యిక్కడనే కాపుర మున్నాడా?

కు:—ఆయనది యీయూరుకాదు. గేపల్లె నుండి అప్పుడప్పుడు వచ్చి ఒకటిరెండురోజు లుండి తిరిగి వెళ్ళిపోవుచుండును.

ఇ:—ఆయన చేరరాదు. నిబంధనలలో నీగ్రామమున నివసించువారు సభ్యులుగా చేరవచ్చు నని యున్నది.

కు:—ఎందుచేత ?

ఇ:—ఏగ్రామములో నుండువారి స్థితిగతులు ఆగ్రామస్థులకే బాగుగా తెలియును. గాని యితరులకు తెలియుట కష్టము. అందుచే అట్టి నిబంధన యేర్పాటు చేసినారు.

కు:—ఇప్పుడు నేను నేర్చుకొనవలసినది యింకేమి కలదు.

ఇ:—ఇంకను చాలనున్నది. మీనాయనగారు చెప్పెదరు. నేను మధ్యాహ్నము బయలుదేరి వెళ్లవలెను. నీకు సంఘమనగానేమో తెలియచెప్పితిని. సహకారులు, పరపతి అను పదముల అర్థము మీ తండ్రిగారు చెప్పెదరు.

కు:—అప్పుడే వెళ్లెదరా. మిగిలిన సంగతులు మాతండ్రిగారియొద్ద తెలిసికొనెదను. అప్పుడే రెండు గంట లయినది. నేను బడికి పోయెదను.

ఇ:—సరే వెళ్లుము.

## నాల్గవ పాఠము.

కు:—నిన్న ఇన్స్పెక్టరుగారు సహకారపరపతి సంఘములను గురించి పూర్తిగా చెప్పలేదు. సంఘమునగా ఏమో బోధ చేసిరి. మిగిలినది మీరు బోధచేసెదరా?

తం:—అటులనే బోధచేసెదను. పరపతి అనగా నేమో చెప్పెదను వినుము. నీపాఠపుస్తకములలో నొకటి నీవద్ద లేదనుకొనుము. అప్పు డేమి చేసెదవు ?

కు:—నాతోడి బాలునివద్ద "చదువుకొని తిరిగి వెంటనే యిచ్చెద" నని తీసికొని వచ్చెదను.

తం:—నీవు తెచ్చిన పుస్తకము నీవు చెప్పిన ప్రకారము వెంటనే యెన్నిగంటలకిచ్చెదనంటివో అప్పటికి యిచ్చివేయవలెను. అటుల నిచ్చిన నీకు తిరిగి యెప్పుడు పుస్తకము కావలసిన నప్పుడిచ్చును.

కు:—అవును. మాబడిలో నొక కుఱ్ఱవాడు తనపెన్సలు పారవైచుకుని పిల్లలవద్ద తిరిగి యిచ్చెద

నని పుచ్చుకుని అదికూడా పోగొట్టెను. అందువలన ఆకుఱ్ఱవాని కెవరును ఏమిన్ని ఇవ్వరు.

తం:—అటులనే యీపరపతి సంఘములలో రయితులకు సొమ్ము బదులుగా నిచ్చుచుందురు.

కు:—ఋణము లిచ్చుటయా? యీసంఘములు చేయుపని.

తం:—సంఘములు చేయుపనినిగురించియు వాటి యుపయోగములును తరువాత చెప్పెదను. ముందు పరపతి అనగా నేమో తెలిసికొనుము.

కు:—చెప్పండి వినెదను అది పూర్తియగువర కు తిర్గి ప్రశ్నలు వేయను.

తం:—నీవు చదువుకొనుటకు నీతోడిబాలుని యొద్ద తెచ్చినపుస్తకము వెంటనే యిచ్చిన నీకు కావలసివచ్చినప్పుడు తిరిగి యిచ్చును. దానినే పరపతి అందురు. నీవాలాగున నిచ్చెదనన్న వేళకు సరిగా నియ్యనియెడల నీకు తిర్గియిచ్చుటకుసందేహపడును అందువల నీపరపతికి కొంచెము లోపము కలుగును.

కు:—అవును నిజమే నేనింతకుముందు చెప్పిన

పిల్లవాని కేమికావలసిన నెవరున్ను ఇవ్వరు.

తం:—అటులనే యీసంఘములలో సొమ్ము బదులు తీయువారు పది నెలలలోగాని ఆరు నెలలలో గాని అంతకు తక్కువ కాలములోగాని యెక్కువ కాల ములోగానియిచ్చెదమనివారియవసరముబట్టిబదులు తీయుదురు. వారావాయిదాకు సరిగానిచ్చిన యెడల వారికితిరిగిబదులిచ్చునప్పుడు కొంచెమైననాలస్యము కాదు. వాయిదాకు సరిగా ఇచ్చువారికే పరపతి యుండును.

కు:—పరపతి అనగా బాగుగా తెలిసినది. నేను బడికి పోయెదను.

## అయిదవ పాఠము.

కు:—నిన్నటిదినము పరపతి అనగా చెప్పితిరి. ఇకను నే నేమి తెలుసుకొనవలెను?

తం:—ఇప్పుడుసహకారులుఅనగా నేమో, చెప్పె దను వినుము. మీరు పటములుగీయునపుడును పంతు

లుగా ఇంటియొద్ద లెఖలు మొదలైన పనులు చేసి చూపించుమనిన నేమిచేయుదురు ?

కు:—ఇంటియొద్దజాగ్రత్తగానాపనులన్నియు చేసి బడిలో నుపాధ్యాయునికి చూపుదుము.

తం:—నీకు తెలియనపు డేమిచేయుదువు ?

కు:—నాతోడిబాలుని సహాయమువలన నాకు తెలియనిది తెలుసుకొనెదను.

తం:—మీలో మీరు సహాయము చేసికొను చుందురు. మీబాలురందరు పరీక్షలువచ్చునప్పుడు, కాగితము, పుస్తకములు కుట్టుకొనునపుడును కాగిత ములకొరకు ఏమి చేసెదరు ?

కు:—అంగడికి పోయి ఒకదస్తా రెండుదస్తాలు ఎవరికి కావలసినవి వారు కొనుక్కొందురు.

తం:—అటులగాక మీకందరకుకావలసిన కాగి తములు ఒకేపర్యాయము కొనిన లాభ ముండును.

కు:—అవునండి నాన్నగారు! మాతరగతిలో కొందరుపిల్లలు కలిసి ఒకరీము కాగితములు కొను క్కొన్నారు. వారికి దస్తా మూడణాలు అయినదని

చెప్పినారు. నేనుమనయింటి కెదురుగానున్న కోమటి దుకాణంవద్దకొనగా మూడణాలు కాని తీసుకున్నాడు.

తం:—చూచితివా ! వారందరు కలిసినందున నెంతలాభము కలిగినదో. నీవును వారితో కలిసిన నాలాభమును పొంది యుందువు. అలాగు కలిసి కొనినవారలను సహకారులని చెప్పవచ్చును. అనగా ఏపనినయినను చేయునపు డొకరికొకరు సహాయ పడువారందరు సహకారులని చెప్పబడుదురు.

కు:—సహకారులకు ఆంగ్లభాషలో నేమనెదరు?

తం:—"కో ఆపరేటర్సు" అని చెప్పెదరు.

కు:—సహకారులపరపతిసంఘములకు ఆంగ్లభాషలో నేమనెదరు ?

తం:—"కో ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ"లని చెప్పెదరు.

కు:—బాగున్నది. మూడు తెలుగుపదములకు మూడు ఆంగ్లపదము లున్నవి.

తం:—ఏఆంగ్లపదమునకు ఏ తెలుగుపదము వాడుదురో చెప్పగలవా ?

కు:—ఓస్ ఇదియే చెప్పలేనా.

తం:—ఏది చెప్పు చూతము.

కు:—సహకారులు అనగా కొఆపరేటీవు. పరపతి అనగా క్రెడిట్టు. సంఘములు అనగా సొసైటీలు. కాని నాకు సందేహము కలుగుచున్నది. సహకారులు అనగా మీరు "కొఆపరేటర్సు" అని చెప్పినారే.

తం:—అవును అటులనే చెప్పితిని. ఇచ్చట సహకారులయొక్క పరపతిసంఘములు అని యర్థము. అందువలన "కొఆపరేటీవు" అను విశేషణము వాడెదరు. "కొఆపరేటర్సు" అనునది నామవాచకము.

కు:—సరియే. ఈపర్యాయము తెలిసినది. నేను బడికి పోయెదను.

## ఆరవ పాఠము.

తం:—నాయనా! నీ వింకను పరపతిసంఘములను గురించి చాల తెలుసుకొనవలసియున్నది. ఈదిన

ము నీవు అందువిషయమై నన్ను అడుగలేదేమి?

కు:—మీరు పూర్తిగా చెప్పినా రనుకొన్నాను. నేనింకేమి తెలుసుకొనవలెను.

తం:—ఇప్పు డేమి నేర్చుకొన్నావు? పదములయొక్క అర్థము మాత్రము తెలిసికొంటివి. పరపతి సంఘములయొక్క ఉద్దేశ్యము లేవియో అవియెన్ని విధములో తెలుసుకొనవలెను.

కు:—అయితే నేను పూర్తిగా తెలుసుకొను వరకు విడువను. పరపతిసంఘముల యుద్దేశ్యములు ముందుగా బోధ చేయవలెను.

తం:—ఇదివరలో మెంబర్లు అనగా నేమో తెలిసికొన్నావా?

కు:—అవును. ఇన్‌స్పెక్టరుగారు చెప్పినారు. ఈసంఘము ఏర్పడుటకు పదిమందికి తక్కువ కాకుండ నుండవలెననిన్ని వారలనే మెంబర్లు అందురనిన్ని చెప్పినారు. మెంబరు కావలసినవారు సంఘములో నొక భాగమైనను కొనవలెను.

తం:—సరియే. ఇక సంఘముయొక్క యుద్దేశ్య

ములు కొద్దిగా చెప్పెదను వినుము. పరపతిసంఘ
ములయుద్దేశ్యములలో మొదటిది మెంబర్లకు కావల
సినసొమ్ము మెంబర్లయొద్దనుంచి గాని మెంబర్లుకాని
వారలయొద్దనుంచి గాని అప్పు తెచ్చి మెంబర్లకు
ఋణము లిచ్చుట.

కు:—మెంబర్లకు కావలసినసొమ్ము మెంబర్లవద్ద
నుంచియే ఋణము తీయు టెట్లు?

తం—ఈసంఘము భాగ్యవంతులు సామా
న్యులు బీదవారు కూడ మెంబర్లుగా చేరవచ్చును.
భాగ్యవంతులెవరైన చేరిన వారియొద్దనుంచి ఋణ
ములు తీయవచ్చును.

కు:—రెండవయుద్దేశ్య మేమి?

తం:—మెంబర్లకు కావలసినగృహకృత్యపు సేద్యపు
వస్తువులను సమూహముగా కొని మెంబర్ల కెవరికి
కావలసినవి వార్లకు సప్లయిచేసి వారలకు లాభ
ము కలుగునటు చేయుట.

కు:—ఈయుద్దేశ్యము పూర్తిగా తెలియలేదు.
తెలియునట్లు చెప్పవలెను.

తం:—గృహకృత్యమనగా మన యింట్లో ప్రతిదినము మనము భుజించుటకున్ను ధరించుటకున్ను కావలసిన వస్తువు లని యర్థము. ఇప్పుడు మనకు కందులు కావలెననిన నేమిచేయుచున్నాము.

కు:—కోమటివు కాణమువద్దకు పోయి కొనుచున్నాము.

తం:—అటులనే మిగిలినవారున్ను కావలసిన చింతపండు, ఉప్పు, మిరపకాయలు, పంచదార, గోధుమనూక, మొదలైనవస్తువు లెన్నియో యెవరికి కావలసినవి వారు కోమటిదుకాణమువద్ద కొనుచున్నారు. ఈసంఘముండిన అటుల అక్కర లేదు. సంఘములో పదిమంది మెంబర్లున్నా రనుకొనుము. వారల కొక్కొక్కరికి వారమున కొకవీశె చింతపండు కావలె ననుకొనుము. మొత్తము పదివీశెలు కావలసియున్నది. ఈపదివీశెలున్నూ ఒకమారే కొనినందున ఎక్కువ లాభము కనుపించును. ఈ విషయము నీవు వెనుక మీాబడిపిల్లలందరు కలిసి కొనినకాగితములలో తెలిసికొని యుంటివి.

కు:—అవును. ఈపర్యాయము తెలిసినది. అటు లనే మెంబర్లకు గావలసిన బట్టలు, ఉప్పు, పంచ దార, చింతపండువగైరా వస్తువులను కొనవచ్చును.

తం:—తరువాత సేద్యపువస్తువులు అనగా వ్యవ సాయమున కుపకరించు వస్తువులు. జనుములు, పెసలు, మినుములు మొదలగు విత్తనములును, వ్యవసాయపు పనిముట్లు అనగా నాగళ్ళు మొదలగు నవిన్ని జాగ్రత్తచేసి యుంచి మెంబర్లకు కావలసి నపుడు అమ్మవచ్చును. ఇప్పుడు బడివేళ అయినది. బడికి పొమ్ము. రేపటిదినము మిగిలిన యుపయోగ ములు చెప్పెదను.

## ఏడవ పాఠము.

కు:—నాన్నగారు! నిన్నటిదినము పరపతిసంఘ ములయుద్దేశ్యములను రెండింటిని బోధచేసిరి. అవి యేవనగా మెంబర్లకు కావలసినసొమ్మును ఏకమొ త్తముగా తెచ్చి వార్లకు ఋణములిచ్చుటయు మెం

బర్లకు కావలసినవస్తువులను సమూహముగా కొని ఎవరికి కావలసినవి వారలకిచ్చుటయు అని చెప్పినారు. ఇక యుద్దేశ్యము లెన్ని యున్నవి.

తం:—ఇంకను మూడు ముఖ్యమైన యుద్దేశ్యములను చెప్పెదను. ఇదివరలో వ్యవసాయదారులకు కావలసినవస్తువులను మొత్తముగా కొని యుంచుట అను విషయము నీకు చెప్పితిని.

కు:—నాకు జ్ఞాపకము లేదని చెప్పుచున్నారా ఏమి? ఇటుల తిర్గిమీరు చెప్పుచురనే మొదటనే నేను చెప్పితిని. కాలమువృథాగా పోగొట్టకూడదని మాఉపాధ్యాయులు చెప్పిరి. చెప్పినది తిర్గి చెప్పిన కాలమువృథాగాపోగొట్టుట కాదా!

తం:—నాయనా! నీవు మంచివిషయమునే తెలిసికొన్నావు కాని విద్యావిషయములో చెప్పినవిషయమెన్నిసార్లు చెప్పినను కాలమువృథా కాదు. మొదట చెప్పునప్పుడు తెలిసినట్లుండును. కాని తరువాత దానిని పరీక్షాధికారులు పరీక్షించునప్పుడు జ్ఞాపకము రాదు. కాన చదివినవిషయము బాగుగ

తెలియునంతవరకు చదువుచుండవలెను.

కు:—అవునండి. నాన్నగారు అందువలననే కొంతమంది పరీక్షలలో తప్పిపోవుచుందురు. ఈవి ష్రయము మీరు ఎన్నిసారులు చెప్పినదే చెప్పినను వినెదను. పరపతిసంఘములయుద్దేశ్యము మరియొక టి చెప్పండి.

తం:—వ్యవసాయదారులకు ధాన్యము పండు ను. పండినధాన్యములో వారలకింటిఖర్చుకున్ను వ్యవ సాయపుపనులకున్ను కావలసినధాన్యమునుంచుకొని యెక్కువధాన్యమును అమ్ముదురు.

కు:—అవును పంటరోజులలో వర్తకులు ప్రతిది నము వచ్చి ధాన్యముబస్తాలను బళ్లమీద తీసికొని పోవుచుందురు.

తం:—వర్తకులు కొనునపుడు ప్రతిరయితు వద్దకు వెళ్లి ఒకరివద్ద తక్కువధరకు ఒకరివద్ద యెక్కు వధరకు కొనుచుందురు. అటులగాక మెంబర్లయొ క్క పంటనంతను సంఘముతరఫున నిలువయుంచి ఒకమొత్తము చేసి పెద్దైన ఫ్యాక్టరీకిగాని గొప్పసా

షాహుకారునకు గాని లేక ధాన్యము ఏదైన పరపతి సంఘమునకు కావలసిన ఆ పరపతిసంఘమునకుగాని విక్రయించుట మరియొక యుద్దేశ్యము.

కు:—అందువలన రయితునకు యేమిలాభము కలదు.

తం:—మనగ్రామములో కొనుటకు వచ్చినవర్తకులు కమిషనుకు కొనుచుందురు. కొంతమంది యెక్కువలాభమునకు అమ్ముచుందురు. ఒకేవర్యాయము ఒకమొత్తముగా అమ్మిన ఆలాభ మంతయు రయితునకే యుండును. అందువలన వర్తకులు గ్రామములో నిచ్చుధరకంటె ఎక్కువ రావచ్చును.

కు:—మరియొక యుద్దేశ్యము చెప్పండి.

తం:—మెంబర్లకు ఐకమత్యము మితవ్యయము. స్వసహాయము నేర్పుట.

కు—ఆమాటలఅర్థము బోధ చేసినగాని నాకు తెలియుట లేదు. రేపు చెప్పండి.

తం:—అటులనే చెప్పెదను. ఆటకు పొమ్ము.

## ఎనిమిదవ పాఠము

కు—నాన్నగారు! ఈదినము ఐకమత్యము మిత వ్యయము స్వసహాయము, అన నేమిగనో బోధ చేసెదరా?

తం:—ఐకమత్య మనగా అందరును కలిసి ఒకే మనస్సుతో పనిచేయుచుండవలెను. పదిమంది బాలురు కలిసి ఆటస్థలమున ఆడుకొనుటకు చేరిరనుకొనుము. అప్పుడు బాలురందరు కలియక అందరును తలకొక యాట యాడుద మనియెదరనుకొనుము. అట్టిసమయమున యేయాటయినను జర్గునా!

కు—ఏ ఆటకూడ జరుగదు ఎక్కువమంది యేయాటాడువలెననిన అందరునందు కొప్పుకొనవలెను.

తం:—అందువలన యేమి తెలిసికొనగలవు. మొదట వారల యభిప్రాయము వేరుగ నున్నను ఎక్కువమంది పిల్లలేయాటాడుదమనెదరో ఆయాటయే ఆడుదురు. అటులనందరు నొకయాటయే

యాడుటవలన వారలలో ఐకమత్యము కలదని చెప్పవచ్చును.

కు:—అవును అటులకలియనియెడల ఆటఉత్సాహముగానుండదు. ఒక్కొక్కప్పుడు బాలురందరును కలియక రెండుపార్టీలుగా నేర్పడి వేరువేరు ఆటలు ఆడుచుందురు. అప్పుడు యేఆటయూ కూడ ఉత్సాహముగా నుండదు.

తం:—అటులనే మెంబర్లందరు కలిసి యేపనిచేసినను లాభకరముగా నుండును. ఇదివరలో బోధచేసినప్రకారము మెంబర్లకు కావలసినవస్తువులన్నియు నేకముగాకొనునప్పుడును మెంబర్లపంటను మొత్తముగాఅమ్మునప్పుడును అందరిలో ఐకమత్య ముండవలెను. వారందరును కలిసి ఏకాభిప్రాయముతో పని చేసిన నందరకును లాభము కలుగును. ఇట్టివి అనేకపనులు అందరును కలిసి చేయవలసి యున్నవి. అవన్నియు నీవు పెద్దవాడవయిన కొలది తెలుసుకొనగలవు.

కు:—ఐకమత్యమనగా తెలిసినది. ఇదివరకేమా

కొక పాఠములో ఈవిషయము బోధచేసిరి. కథచె ప్పెదను వినండి. ఒకతండ్రికి నలుగురుకుమారులు కలరు. తండ్రిచనిపోవునపుడు పిల్లలనందరను పిలిచి ఒక్కొక్కనికి పదిగడ్డిపోచ లిచ్చి వారిలో ప్రతివా రిని తెంపుమనెను. వారలు సులభముగా త్రెంచగ లిగిరి. అవన్నియు కలిపి ఒక్కొక్కనిచేతికిచ్చి త్రెం పుమనగ వారలకు మునుపటికంటె కష్టముతోచెను. అప్పుడు వారిని చూచి మీరందరు కలిసియుండిన యెడల నెవరును మీకపకారము చేయలేరు. అందు లకుదాహరణము చూపుట కేగడ్డిపోచలను మీచేత త్రెంపించితిని. అనిచెప్పుచు ప్రాణములు వదలెనట.

తం:—అట్టికథలు చాలగకలవు. ఐకమత్యమువల న చాలలాభములు కలవు. అవన్నియు క్రమముగా నీవే తెలిసికొనగలవు.

కు:—మిగిలినసంగతులు రేపు చెప్పవచ్చును. బంతిఆటకు వేళ అయినది పిల్లలందరు ఈసరికి చేరి యుందురు. బంతినాదగ్గర నే యుండుటచే పిల్లలందరు నాకొరకు చూచుచుందురు.

తం:—అయితేపొమ్ము. అపుడే అయిదుగంటలు కావచ్చినది. నేనును పుస్తకభాండాగారమునకు వెళ్ళి వార్తాపత్రిక చదువవలెను.

## తొమ్మిదవ పాఠము.

కు:—నాన్నగారు! మితవ్యయమున్వసహాయము అన బోధచేసెదరా?

తం:—మితవ్యయమనగా కావలసినఖర్చు చేసుకొనుట. సొమ్ము వృధాగా ఖర్చుచేయకుండుట.

కు:—ఎవరైనను వృధాగా ఖర్చు పరచెదరా?

తం:—చాలమంది వృధాగా ఖర్చుపరచెదరు.

కు:—అది యెట్లు?

తం:—బాలురు కొందరు కాపీయింకుపెన్సిళ్లు కొనుచుందురు. అందులకు ఒక్కొక్క పెన్సలుకు రెండుఅణాలు ఖర్చు పరుచుచుందురు.

కు:—అది వృధా ఖర్చు ఎట్లగును. కాపీయింకు పెన్సలుతో వ్రాసిన స్పష్టముగా తెలుసును.నోట్సు

అందముగా కనుపించును. మార్కులు ఎక్కువ వచ్చును.

తం:—అవును నీవు చెప్పినది నిజమే. అయినను కానిపెన్సలుతో వ్రాసినను జాగ్రత్తగా వ్రాసిన సంవత్సరమంతయు నోట్సు తెలియుచుండును. నాచిన్నతనములో డబ్బు పెన్సలుతో వ్రాసినది యిప్పటికి స్పష్టముగా కనుపించుచున్నది. జాగ్రత్తగా వ్రాసిన యెడల నల్లపెన్సలుతో వ్రాసినను ఎక్కువమార్కులు వచ్చును.

కు:—అవును. మాతరగతిలో శాస్త్రిల్లు అనుపిల్లవాడు ఎప్పుడు కానిపెన్సలుతోనే వ్రాయును. అతనికి కాపీయింకుపెన్సలుతో వ్రాయుచున్నవారలకన్న ఎక్కువమార్కులను మాఉపాధ్యాయులిచ్చుచుందురు.

తం:—ఇందువలననీవు తెలుసుకొనవలసినదేమి?

కు:—పిల్లలశ్రద్ధ ననుసరించి మార్కులు వచ్చుచుండును. గాని యెక్కువసొమ్ము ఖర్చుపరచికొను సాధనములవలన కాదని తెలిసికొంటిని.

తం:—కావున రెండణాలు పెట్టి కొనుపెన్నలు కన్న డబ్బుపెన్నలు కొనిన ఏడుకానులు మిగులును. అటులనే అనవసరమైనవస్తువులను కొనుటచేతను జాగ్రత్త లేకపోవుటచేతను జనులు ఎక్కువసొమ్ము ఖర్చుపరుచుచుందురు. అటుల గాక సాధ్యమైనంత వరకు మనదగ్గిరనున్నసొమ్మును చూచి అవసరమైన ఖర్చు చేయుట మితవ్యయము అనబడును.

కు:—సంఘమువలన ఒక మెంబరు మితవ్యయము నెట్లు నేర్చుకొనగలుగును?

తం:—సంఘములో ఋణము కావలసినపంచాయితీదార్లకున్ను జామీనుదార్లకున్ను తప్పక తెలియవలెను. తరువాత నితరమెంబర్లకు కూడ తెలియును. వారలందరును బదులు తీసినమెంబరు వృధాగాఖర్చుపరచకుండ చూచుచుందురు.

కు:—అది ఎట్లు?

తం:—మెంబరునకు అప్పుకావలసినపుడు తనకే కార్యమున కప్పు కావలెనో చెప్పవలెను. ఒకస్వల్ప వ్యవసాయదారు ఎద్దుల కొనుటకు నూరురూపా

ములు బదులు కోరె ననుకొనును. ఆయనకు ఎద్దు లయందునుండు నుత్సాహముచేత తనకు తాహతు లేకపోయినను అటుల గోరును. అప్పుడు మొదట జామీనుండువారు సలహానిచ్చి యేబదిరూపాయిలు విలువగల యెద్దులు నీకు చాలునని సలహా నిచ్చి ఆయనను తాహతుమీరి ఖర్చు పరుచకుండ చేయును. తరువాత పంచాయితీదార్లు ఆలోచించి యింకను తగ్గించవచ్చును. అటులనే యితరకార్యముల కప్పు కోరునపుడుకూడ మెంబర్లు తాహతుమీరి ఖర్చుపరచకుండ పంచాయితీదార్లు చూచుచుందురు.

కు:—ఎందువలన ?

తం:—వారలపూచీ తమయం దుండుటవలన వాయిదాకు సరిగా మెంబరుదగ్గరనుండి సొమ్ము వసూలు చేయువలెను గాన పంచాయితీదార్లు జాగ్రత్తగా నుందురు.

కు:—జామీన్ దారు అనుమాట మీరు ఉపయోగించినారు. జామీనుదారు అనగా నేమియో చెప్పవలెను.

తం:—సంఘములో ఋణము తీయు మెంబరుకు సంఘములోనుండు ఇతర మెంబర్లలో నొకరుగాని లేక యిద్దరుగాని పంచాయితీదార్లు కోరినప్రకారము జామీనుండవలెను. అనగ బదులుతీసిన మెంబరుదగ్గర సొమ్ము వసూలుకానపుడు జామీనున్న మెంబర్లు ఇచ్చుకొనవలెను.

కు:—సరియే యీ పర్యాయము తెలిసినది. అందువలననే జామీనుదార్లు ఋణముతీయు మెంబరు ఎక్కువఋణము తీయకుండునట్లు చూచును.

తం:—జామీనువిషయము మీపిల్లల యుదాహరణ నిచ్చెదను వినుము. ఎవరికైన పిల్లవానికి పుస్తకము ఎరువు కావలెననుకొనుము. వానియందు నమ్మకము లేనపుడు మరియొకపిల్లవాడొప్పుకొనిన నిచ్చెదరు. అదియే జామీను అని తెలుసుకొనవలెను.

కు:—జామీను అనగా బాగుగా తెలిసినది. స్వసహాయమును గురించి రేపు చెప్పవచ్చును. నేను ఆటకు పోయెదను.

పదియవ పాఠము.

కు:—నాన్నగారూ! స్వసహాయమన నేమియో తెలిపెదరా?

తం:—స్వసహాయ మనగా తనకు తానే సహాయము చేసికొనుట యని తెలిసికొనుము.

కు:—అది యెట్లు? సహాయముఅనుమాటలోనే రెండవవారుండవలెను అని తెలుపును. తనకు తాను సహాయము చేసికొనుట యెట్లో తెలియకున్నది. తనకు తానే సహాయము చేసికొనునపుడొకరితో నొకరికి సంబంధ ముండనక్కర లేదు.

తం:—అది గొప్పవిషయము. ఒకసంవత్సరము లోపుపిల్లలు చేయుపనులను చూడుము. వారలు మొదట ప్రాకునపుడును నడువబోవునపుడును తమకు తామే పొట్టమీద ప్రాకుటయు గోడలు పట్టుకొని మరియొకరి సహాయము లేకయే నడచుటకు ప్రయత్నించుటయు చూచుచుందుము.

కు:—అవును. చిన్నపిల్లలు నడచుటకు ప్రయత్నము చేయుసమయములో లేచుచు పడుచు నం

దురు. రెండడుగులు వైచి పడుచు తిరిగి లేచి నడ చుటకు ప్రయత్నించుచుండురు. అది చూచుట కెంతయు సంతోషముగా నుండును. ఈయుదాహరణమువలన స్వసహాయము బాగుగ బోధయగుట లేదు.

తం:—నీవు పాఠములు చదువుకొనుటలోను గణితము ఇంటియొద్ద జరుపవలసిన వ్రాతపనులు మొదలగువాటిలో ఉపాధ్యాయులు కొద్దిగా బోధచేయుదానిని అనుసరించి నీవు స్వంతముగా చేయుచుందువు. నీవు మరియొక బాలునిసహాయములేకయే పనులన్నియు జరుపుచుందువు. అదికూడ స్వసహాయమని చెప్పవచ్చును.

కు:—ఇంకను బాగుగా తెలియలేదు.

తం:—మరియొక యుదాహరణ చెప్పెద వినుము. నీకు కావలసినవస్తులకు బజారునకుపోయి మీతండ్రి బట్టలను కొని తెచ్చుచున్నాడు. అటులగాక ప్రత్తి మీపొలములో పండించుము. ఆప్రత్తిని ఏకులుగా చేయించుము. అప్పుడు రాట్నముమీద నూలు వడకుము. బట్టనేయుటకు కూడ నేర్చుకుని బట్టనేయుము.

ఇటుల చేయుటకు సంవత్సరములో ప్రతిదినముఒక గంటకాలముగడిపిన చాలును. అంతటనిరునీవు సహాయము చేసికొన్నవాడవగుదువు ఒకరిమీద నీవు ఆధారపడి యుండనక్కరలేదు.

కు:—నాన్నగారు! ఈపర్యాయము బాగుగా బోధపడినది. ఇప్పుడు చెప్పినయుదాహరణ బాగుగానన్నది. అందువలన నొకవృత్తిని కూడ నేనభ్యసించినవాడ నగుదును. మనగ్రామములో చాల మంది నూలు వడుకుచున్నారు. నేనుకూడ నేటిదినమునుండినూలువడికెదను. రాట్నముకొనిపెట్టెదరా?

తం:—నాయనా! నీకంత కుతూహలమున్నయెడల తప్పక యీదినముకో ఆపరేటివ్‌స్టోర్సునుండి రాట్నము ఏకులు తెప్పించెదను. నీవు నూలువడికిన నాకెంతయు సంతసముగా నుండును.

కు:—నేను ఒక్కడనే కాదు. నేను నేర్చుకొన్న తరువాత నాస్నేహితులను కూడ ప్రోత్సహించి వారలచేతకూడ చేయించెదను.

తం:—సేబాష్! నీవంటిపుత్రు లుండిన దేశము తిత్వరలో వృద్ధిపొందగలదు. వెళ్ళి ఆడుకొనుము.

## పదునొకండవ పాఠము

కు:—పరపతిసంఘములయుద్దేశ్యము లన్నియు చెప్పితిరా?

తం:—ఇదివరలో చెప్పినయుద్దేశ్యము లెవ్వియో చెప్పు వినియెదను.

కు:—నాకు జ్ఞాపకము లేదనుకున్నారా యేమి? చెప్పెదను చూడుడు.

(1) మెంబర్లయొద్ద నుంచియు మెంబర్లుకాని యితరులయొద్దనుంచియు ఋణము తీసి యుపయోగకరమైన కార్యములకు మెంబర్లకు అప్పు లిచ్చుట.

(2) మెంబర్లకు కావలసిన సేద్యపు, గృహకృత్యపు లేక యితర అవసరవస్తువులను మొత్తముగ కొనుటకున్ను వారిపంటను మొత్తముగ అమ్ముటకున్ను ఏజంటుగా వ్యవహరించడము.

(3) సాధారణముగా మెంబర్లలో మితవ్యయము, స్వసహాయము, ఐకమత్యము వృద్ధిపరుచుట.

తం:—చక్కగా చెప్పితివి. ఇంకను రెండువిషయములు చెప్పెదను వినుము. పనిముట్లు (యంత్రి

సామగ్రిలు లేక పశువులు కొనియుంచి మెంబర్లకు గుత్తకియ్యడము.

కు:—అది యెట్లు?

తం:—సంఘముతరపున నాలుగు కాళ్ళయెద్దుల నుకొనియుంచుదురు. వాటికి మేత వగైరాలు సంఘములాభమునుంచియే ఖర్చుపరచి పెట్టుచుందురు. పాపము పశువులు కొని వ్యవసాయముచేయలేని రయితులకు కొంచెము అద్దె నిర్ణయించి యిచ్చెదరు. వారు పొలములు దున్నుకొని తిరిగి సంఘమునకు తోలివేసెదరు. అటులనే ఆపశువులను అవసర మున్నపుడెల్ల నుపయోగపరచెదరు.

కు:—పనిముట్లు యంత్రిసామగ్రిలు అననేమి?

తం:—వ్యవసాయపుపనిముట్లు అనగా నాగలి మొదలైనవి. క్రొత్తపద్ధతులమీద నుపయోగించునవి కొని యుంచి రయితులకు అద్దెకు నిచ్చుట, నీరుతోడు యంత్రములు గొట్టములు వగైరాలు సంఘముతరపున తెప్పించి మెంబర్ల కవసరమున్నపు డద్దెకిచ్చుట.

కు:—ఇంకేమైన నుద్దేశ్యము లున్నవా?

తం:—సంఘముయొక్క యుద్దేశ్యము లెన్నియయిన చెప్పవచ్చును కాని యింకొకటి చెప్పి సంఘోద్దేశ్యములు పూర్తిపరచెదను.

కు:—అది యేది?

తం:—వ్యవసాయము, చేతిపనులు, బట్టలనేతను గురించిన నవీనాభివృద్ధిపద్ధతులను తెలియపరచి సదరుపద్ధతులు మెంబర్లవలంబించునట్లు ప్రోత్సహించడము?

కు:—చేతిపనులు అనగా కొంతబోధ చేసెదరా?

తం:—కుమ్మరివాడు కుండలు చేయును. కొబ్బరికాయలు విశేషముగ దొరకు చోట కొబ్బరితాడు అల్లుదురు. విశాఖపట్టణములో దంతముతో బొత్తములు దువ్వెనలు మంచములకుకోళ్లు పెట్టెలు మొదలైన వెన్నియో చిత్రవిచిత్రములైనపనులు చేయుదురు. పైనచెప్పిన వన్నియు చేతిపనులు.

కు:—ఆఖరుద్దేశ్యము అనగా వ్యవసాయము, చేతిపనులు, బట్టలనేత, నూలుతయారుచేయుట, అభి

వృద్ధికి తెచ్చుట అనువిషయము సంఘము లవలంబించిన దేశము వృద్ధిలోనికివచ్చునని నానమ్మకము.

తం:—బాగుగా తెలిసికొంటివి. నిజమే దేశము వృద్ధిలోనికి వచ్చుటకు అదియె మార్గము.

పండ్రెండవపాఠము

కు:—నాన్నగారు! నిన్నటిబోధ చాల ఉత్తమమయినదిగా కనుపించినది. దేశాభివృద్ధికి చేతిపనులయభివృద్ధియె కావలెను. పరిశ్రమల యభివృద్ధికొరకు సంఘములు స్థాపించుట చాలముఖ్యమని తోచుచున్నది.

తం:—అవును. పారిశ్రామికసహకార మభివృద్ధి చెందినగాని దేశమభివృద్ధికి రాదు.

కు:—మీరు చెప్పినది బాగున్నది. సహకారపరపతిసంఘములు రయితులకేగాని చేతిపనులుచేయువారికి పెట్టరాదా?

తం:—పెట్టకేమి? నేతనేయువారికి సంఘములు అచ్చటచ్చట గలవు. గవర్నమెంటువారు పారిశ్రామికశాఖ అనునది ఒకటి నియమించిరి. ఆశాఖవా

రు పరిశ్రమల యభివృద్ధికొరకు ప్రయత్నించు చుందురు.

కు:—పరిశ్రమలు అభివృద్ధిచేయుటకు కూడ ఇన్‌స్పెక్టరులు గలరా? వారికి పరిశ్రమలు కొన్ని తెలిసియుండునని అనుకొనెదను. అయిన స్పెక్టరుగా రిసికూడ మనగ్రామమును కురప్పించండి. నేను వారి దగ్గర కొన్ని పరిశ్రమలు నేర్చుకొనెదను.

తం:—నీకు పరిశ్రమల యభివృద్ధియందుగల ఉత్సాహమునకు నాకు సంతసముగా నున్నది. వారి గ్రామిక శాఖ పిరివిగా వృద్ధి కాలేదు. క్రమముగా వృద్ధి పొందగలదు. ఆశాఖలో ఉద్యోగులు చాలతక్కువ. సహకారశాఖవలె ఇంకా ఇన్‌స్పెక్టరులు వృద్ధి కాలేదు.

కు:—నాన్నగారు ! పరిశ్రమలన్నిటిలో ఏది ప్రతివారు నేర్చుకొనుటకువీలుండునో, ఏదిబీదలకును భాగ్యవంతులకును ముఖ్యావసరమో, ఏదియెక్కు వధనము ఖర్చుపరచకుండ సాధ్యమగునో చెప్పెదరా?

తం:—ఆపరిశ్రమ యేదో నీవు తెలిసికొన

లేవా? అనేకపరిశ్రమలు గలవు. సబ్బులు చేయున చ్చును. అగ్గిపెట్టె లందరకును కావలసి యున్నవి. కాగితములు కూడ అందరకును కావలసియున్నవి.

కు:—మీరు చెప్పిన పరిశ్రమలు నామనసున కెక్కుట లేదు. సబ్బులు అంత అవసరముగా నాకు తోచుట లేదు షోకుకావలసినవారికే అవి కావల యును. అగ్గిపుల్లలు అందరకును అవసరము లేదు. అయినను అవి చేయుట చాలకష్టము. కాగితము లు చేయువిధానము మా పాఠపుస్తకములో నున్న ది గాని అది అర్థమగుట లేదు.

తం:—నీయభిప్రాయ మేమో తెల్పుము.

కు:—నూలువడకుట బట్టలు నేయుట అను ప రిశ్రమలు చాలముఖ్యమయినవని నాయుద్దేశ్యము.

తం:—నీయుద్దేశ్యము సరియయినదే కానిమన వారలు రాట్నము మీద వడకునూలు చాల లావు గా నుండుటచే బట్ట మోటుగా నుండును. అట్టిబట్ట లు ధరించుట చాల కష్టముగా నుండును. నాగరిక తకలిగినప్రపంచమున మోటతనము అలవడునేమో యని భయ మగుచున్నది.

కు:—నాన్నగారు! మీరు పెద్దలు. మీకంటె నాకెక్కుడు అనుభవము లేదు. కాని మీపిల్ల లెంత అనాకారులయినను మీకు ముద్దుగా నుండరా?

తం:—అవును. ఇతరపిల్లలకంటె నాపిల్లలయందు ఎక్కువ ప్రేమయే నాకు గలదు.

కు:—అటులనే మనము వడుకుకొనిననూలుతో నేసిన బట్టయందు ఎక్కుడువిలువ యుండును. ప్రేమ యుండును. నేర్పు అయినకొలదియు సన్ననినూలు వడుకవచ్చును. దినదినము ఒకగంటకాలము ఆపరిశ్రమయందు పాటుపడిన నెవరికికావలసినగుడ్డ వారు తయారు చేసికొనగలుగుదురని నేను అనుకొనుచున్నాను. కనుక మనగ్రామములో నివారందరు ఒకవడుకునూలు వారలసహకారసంఘముపేరనొకటి స్థాపించి పనిచేయుచుండిన సరదాగా నుండును. ఆసంఘములో చేరినమెంబరు తనయింటికికావలసినబట్టకు నూలు తన యింటియందే తయారు చేసికొనెదనని ప్రతిజ్ఞ పట్టవలెను. మనగ్రామమునకు మరియొక చోట నుండి గుడ్డ రాకుండ చేసికొ

నవలెను. అప్పుడే మనము స్వసహాయమను సూత్రమును తెలిసికొనినవార మగుదుము.

తిం:—నీవు చెప్పినది బాగుగా నున్నది. నాకును అట్టివిషయము జరిగిన ఆహ్లాదముగా నుండె

కు:—అటులయిన పిల్లలందరము ఒకసంఘముగా చేరెదము. మీరు ఏకులు, కదుళ్ళు, రాట్నము ఇప్పించుడి. మేము ప్రతిదినము నూలువడికిచ్చెదము. మాలో పెద్దవాళ్ళకు నేతకూడ నేర్పిన మాబట్టలు మేమే తయారుచేసికొనగలము. పెద్దలందరు చేరి మాబట్టలకు ప్రతిసంవత్సరము ఇచ్చుసొమ్మును చేర్చి మాపిల్లలసంఘమును నడుపవచ్చును.

తిం:—అటులయిన మీరే పెద్దవారలకు మార్గదర్శకు లయ్యెదరు. భోజనమునకు వేళ అయినది వెళ్ళుము.

సమాప్తం.

# "సహకార వల్లరి."

పశ్చిమదేశములలో సహకారవిజ్ఞానము విరివిగ వెదజల్లవలసియున్నది. దేశములో సహకారోద్యమమునుగూర్చి నిర్వహింపబడు పత్రికలు చాలతక్కువ. ఏటేటను సహకారసంఘములు వృద్ధియగుచున్నవి. సభ్యుల సంఖ్య పెరుగుచున్నది. కాని యాదర్శకముగ నిర్వహింపబడుసంఘములుబహుకొద్ది. సహకారాదర్శకములను గ్రహించి వాటిని ఆచరణలో బెట్టు సభ్యులుఅరుదు. సహకారసంఘమున చేరినయెడల తక్కువ వడ్డీకి ధనము లభించుననునాశతో పలువురు సంఘమున చేరుచున్నారేగాని సహకారోద్యమపవిత్రాదర్శములను గ్రహించి చేరుటలేదు. స్వయంసహాయము, పరస్పరసానుభూతి సోదరభావము, సాంఘికసమిష్టిజీవనము సహకారవాదులలో ప్రబోధించుట సహకారోద్యమాభిమానుల విధ్యుక్తధర్మమైయున్నది. సహకారవిద్యాప్రచారము బాగుగ సలిపినగాని యీకొరతతీరదు.

ఆలమూరు లోకల్ కోఆపరేటివుయూనియన్ వారు యీసహకార విద్యావ్యాప్తికి పై శీర్షికతో సహకారోద్యమముగూర్చి కరపత్రి ప్రకటన వ్రాని యున్నారు. సహకారవాదు లెల్లరు యీప్రయత్నమునకు తోడ్పడవేడుచున్నాను. వలయువారు ప్రతినెలకును ఒక్కొకఅణా విలువగల తపాలా బిళ్ళలు యీదిగువ చిరునామాకు పంపుచుండిన యెడల వారలకు కరపత్రిము లుచితముగా పంపబడుచుండును.

నరసింహదేవర సత్యనారాయణ,
కార్యదర్శి,
లోకల్ కో ఆపరేటివు యూనియన్
ఆలమూరు. రామచంద్రపురం తా॥
గోదావరిజిల్లా.

